ఇందుల కెంతకాలం బయ్యె రానికారణం బేమి॥ భార. ఆర. ౨౯౪॥ (చూ. క్రింద) మొ.

వ్యాఖ్య - కొన్ని యెడల ఒకవాక్యము నడుమ మఱొక చిన్నవాక్యము చేరి యుండవచ్చునని సూత్రతాత్పర్యము.

[ నిజమునకు వాక్యగర్భమున మఱొక వాక్యము చేరియున్న యెడల దాని నాలంకారికులు వాక్యగర్భ దోషముగా పరిగణించిరి. మహాకవుల ప్రయోగములయందును అట్టివి కలవు. కావున వానిని దోషములుగా పరిగణించుట యుక్తముకాదు. దేనినైనను దోషమని కాని, దోషముకాదని కాని నిర్ణయించుటకు ఫలితమునుకూడ గ్రహించుట యవసరము. ఈదృష్టితోనే ప్రౌఢవ్యాకరణకారుడు ఇట్లుండుట దోషము కాదనియు, ఇట్లుండ వచ్చుననియు తనసమ్మతిని తెలియజేయుచున్నాడు. దానికి బలముగా భారత ప్రయోగమునే చూపుచున్నాడు. ]

"ఇందుల కెంతకాలం బయ్యె రానికారణం బేమి?" అను వాక్యమునందు నిజమునకు రెండు వాక్యములు కలవు. 'ఇందులకు రాని కారణం బేమి?' అన్నది ప్రధానవాక్యము. 'ఎంత కాలంబయ్యె' అన్నది వాక్యాంతరము. ఇట్లుండుట కాక్షేపము లేదు. ఇట్లున్నప్పుడు అన్వయక్లేశముకాని, విపరీతార్థ స్ఫురణము కాని కలుగునెడల దోషశ్రేణికి చేర్పవలసి వచ్చును. అప్పుడు దానిని పరిహరించుట యావశ్యకము.

**52.** పొమ్ము నిశ్చయార్థంబునం దగు. (ప్రౌ - ౨౨)

అల్లునిఁ గల్యాణగుణోత్తరుం బడయ కెట్లుం బోవఁబొమ్మంచు॥ నిర్వ. ౩౮॥ మొ.

వ్యాఖ్య - 'పొమ్ము' అను సమాపకక్రియను నిశ్చయమును దెలియజేయుటకై యితరక్రియలవెంబడి నుపయోగింప వచ్చునని సూత్రతాత్పర్యము.

'పొమ్ము' అన్న రూపము 'వెళ్ళుము' అను నర్థమున మధ్యమ పురుషైక వచనమున నగును. కాని, దానికి విశేషముగా నిశ్చయార్థము కలదు. ఇది యిప్పుడు మధ్యమపురుషక్రియగానే వ్యవహరింపవలసిన యవసరము లేదు. అవ్యయమాత్రముగానే ప్రవర్తించును.

పడయకెట్లుం బోవను + పొమ్ము అనియుండగా 'పడయ కెట్లుంబోవఁ బొమ్ము' అని యయ్యెను. దీని "కెట్లయినను బడయుట నిశ్చయము' అన్న యర్థము కలదు. ఈయర్థమున ములోపముతోడి 'పో' అను రూపమును గూడ వాడవచ్చును.

**53.** పద్యంబులకుం గులకం బగు. (ప్రౌ - ౫౩)

కులకం బనఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము॥ తా నొకపండు చెచ్చెరన్ - కొని వచ్చునః॥ భార. ఆది. ౨౮॥ ౧౯౮, ౧౯౯॥ మొ.

వ్యాఖ్య - పద్యము మఱొకపద్యముతో నన్వయమును గలిగి యుండును. అనగా ఒక్క పద్యమునందలి వాక్యభావము, ఆపద్యములో సమాప్తము కాక తరువాతి పద్యములో సమాప్తము కావచ్చును; కొన్నియెడల ఒకే భావము రెండు పద్యములకంటె ఎక్కువ పద్యములలో సమాప్తము కావచ్చును. ఇట్లు ఒకపద్యము

పద్యాంతరముతో అన్వయమును కలిగియున్న 'కులకము' అని యందురు.

'తానొకపండు చెచ్చెర' అన్నది మొదటి పద్యములోని వాక్యము. ఇందు 'పండు' అను కర్మమును 'తాను' అను కర్తయు నున్నవి. క్రియ యీపద్యమునందు లేదు. తరువాతి పద్యమునందు 'కొని వచ్చుడు' అని క్రియ నిక్షేపింపబడినది. దీనికి 'కులకము' అని ప్రౌఢవ్యాకరణకారుడు పెట్టినపేరు.

సాధారణముగా రెండు పద్యముల కేకాన్వయ మున్నచో 'యుగ్మము' మూడు పద్యముల కున్నచో 'విశేషకము' నాలుగు పద్యముల కున్నచో 'కళాపకము' ఐదు పద్యములకుగాని అంత కంటె నెక్కువ పద్యములకుగాని యున్నచో 'కులకము' అని వ్యవహరింతురు. ప్రౌఢవ్యాకరణ కారుడు ఇన్ని భేదములజోలికి పోక, స్థూలముగా పద్యమునకు పద్యాంతరముతోడి యన్వయ మునకే 'కులకము' అన్న సంజ్ఞను వాడుకొనెను.

"శ్రీ స్తనాంచిత కస్తూరీ పంక సంకలితోరసే
పంకజాక్షాయ నాథాయ వేంకటేశాయ మంగళమ్."